కనులజూచేనంటె నాటిగాదె దాని - కడప కొమ్మా ఆ
కనకాంగి జూచి నేస్తుకొన్నా నింత - కలిసి కొమ్మా॥
నూతనముగ వచ్చిన యింతివలె కా - నుగ కొమ్మా పరమ
ఘాతకులైతె నేలాగున చిత్తము - గరుగు కొమ్మా॥
రమణీమణులు వెన్న లయారు పాపములే మగరాల కొమ్మా - నాపై
మమత మరచి యుండే యున్నాడుగదవె నీ - మంగ కొమ్మా॥
ఎనసి వేణుగోపాలుని కిది మరి - యూద కొమ్మా సుంత
కనికరమని లేదె వేడనచే మేను - కంది కొమ్మా॥

## 4. సావేరి - త్రిపుట

సొంపుల వేడ్కగల పదము

పల్లవి - ఆ వాలుగంటి మాట లతని కతిమధురమాయె
నన్నింత మోడి సేతురా
అను... గావే యూరక పాద - రసమువలె తిరిగేవు
భావము దెలిసి యి - ప్పటికోర్చుటే బాగు॥ ॥ఆవాలు॥

బాలరో పతిమనసు - పాషాణమని దెలిసి
ఏల కులుకులాడిని - ఎంత లేదంటివి
చాలునే శుద్ధమడ్డి - సాంబ్రాణివే నీవు
ఆ లోలాక్షి నెదిరించి - అతివా సాధింతువా॥ ॥ఆవాలు॥

అక్కర కా రమామణిని - అనుసరించితే బిరుదు
తక్కువా యూరకే చక్క - ట్లభినయించేవు
కక్కసమైతే యొక్కరిక - క్కరకంటు గారాదే
ఇక్కు పరుగనంటే నగా - ఇందు పూబోణులు॥ ॥ఆవాలు॥

ఎల నాగకేసరా - లిచ్చితె నీకేమి
చలపట్టి యిప్పుడు ర - చ్చల కాకాచుకున్నావు
పలుమారు వేణుగో - పాలా సేసనేటిక
కలసి యుండాముచుచు - బిలువవే రుజువుగా॥ ॥ఆవాలు॥

## 5. పంతువరాళి – ఝంపె

మానుల పేర్లుగల పదము

పల్లవి – పడతి నే స్తము వేఱుగో – సాల మాను
అను...తడబడక నీవికను – దాని చింత మాను॥ ॥పడతి॥

పంతమున అటుదిక్కు పదినాళ్ళు పోక మాను
యింతికిచ్చేవు సుఖీ ఈతిమాను
సుంతమనసు ఘట్టిచేసి – సుదతి రెవెన్నాళ్ళవిసమాను
చెంతదీయు కది సుఖము – జగడగొంటి మానును। ॥పడతి॥

సతతము దీనితో నీకు – సైలాయు నేగిమాను
మతి యింత లేదు శుద్ధ మతిమాను
హితవుగా నావద్ది కీసుద్ది తేకుమాను
తతిగా దిపుడు నీవా – సతిని బల్లమాను॥ ॥పడతి॥

చెలిని గూడినది మొదలు – చేతికాసు వాడినమాను
అలివేణి నిన్ను నేను – లకుగు మాను
నలితిండి బెడితివా – నాకు సింగిరేమమాను
పొలతి కొసగకు చేతి – పూలగుత్తి మాను॥ ॥పడతి॥

## 6. పంతువరాళి – ఆది

ఊళ్ల పేర్లుగల పదము

పల్లవి – కడపదాటి రానీయకే
అలవాని మాయగంటి నాతిని నీయకే

అను...పడతిరో ఇక్కేరి – పగుదల సేసి నన్ను
విడనాడి పొమ్మనిన – నేఱుగో పాలుని॥ ॥కడప॥

మగువరో పుణ్యానికే – మనుచు దరిశించెనే
మగరాల కమ్మలా – మదిగాతికి
వగకాని కెట్టామిడుం – వాణి నెళనాడమునుకే
అగడై తిరువీధిలో అతని పేరూ రశిగేర్ప॥ ॥కడప॥

ఇంతగ నాకుతూకై - ఏమి యొడిగట్టుకొంటి
అంతరంగ మిద్దరికి - అయి రాలేదే
పంతగించి నాపై లేని - పళికొండగ గావించి
జంకెలుజేసి యును - రనిపించిం దెఱుగవేమొ॥ ॥కడప॥

కోటయుంటినే గోల - తొండగయెంతో నమ్మి
ఈ రేడుజగము లెఱుగ - నిదివరకు
కూరిమితో నన్ను చిత్ర - కూటమున కూడి పాడి
పేరు జెప్పిన ముందర ఆ - పెనుకొండను భూషించెను॥ ॥కడప॥

## 7 గౌళిపంతు - జంపె

ఔషధముల పేర్లుగల పదము

పల్లవి - వరకన్యా తిలకమిా - వనిత పేరు దీని
అను...పరికించ వేణుగోపాల నాసామి॥ ॥వరకన్యా॥

పోలతినెమ్మోము సం - పూర్ణచంద్రోదయము
అలకాళిరుచి వినో - దాంజనంబు॥ ॥వరకన్యా॥

దాని మృదుమధురోక్తి - ద్రాక్షాదిరస మెంచ
మాలవతి చూపు మ - న్మథబాణ సమము॥ ॥వరకన్యా॥

చెలియ దాని గుణంబు - చింతామణిస్ఫూర్తి
అలరించు పాట శ్రుతి - కాసంత రసము॥ ॥వరకన్యా॥

సరసాంగి పొక్కిలి వ - సంతకుసుమాకరము
అరయగా చనులు బి - ల్వాది నిరసించు॥ ॥వరకన్యా॥

తరుణి సర్వాంగనుం - దరముము రతినేలు
కరుణ రాజమృగాంక - కలయుమిక రతిని॥ ॥వరకన్యా॥

బలిమి నీ గుబ్బలు బట్టి జూచుట జేసి
తలిరుబోణి మందర – ధరుడని తలతువే॥ ॥ఏమిటికే॥

మరుకేళి నినుగూడి – మరిగినదే గురిజేసి
మదన జనకుడని – ప్రేమను గొలుతువే
పరిమళవతి నీమై – పసుపు దుప్పటైనది
అరసి పీతాంబర – ధరుడని కొందువే॥ ॥ఏమిటికే॥

## 10. భైరవి – ఆది

పల్లవి – కందువ లెంచి ఈడకురా – కుందు వున్నాడే ఓ
అను... క్కందుకని వగతునాయిక – గందువులేవే। ॥కందువ॥

మందయాన నాపేరంటె – మందారమైన తనకు సం
మంద మేమన్నాడట – మందరధరుడు॥ ॥కందువ॥

ఆనాటి నెడబాయనని – యానబెట్టిన సుద్ది
ఆనతీయలేదా మనతో – నానాడా మగువ॥ ॥కందువ॥

మానినీ వాడు నాసొ – మ్మనియుంటి నేకనికర
మూనిలేదా కనకాంగే – సరిమరి యున్నాడే॥ ॥కందువ॥

పాంచమాలిన వేణుగో – పాలుడు ననుగూడిన దేనె
పాలుబెట్టి అదియేమో కో – పాలు చేసెనే॥ ॥కందువ॥

## 11. భైరవి – ఆది

పల్లవి – రారా కోట్లాడితేనే రారా పోలేరా
అను... వేరా మీమీరాపెకేగుడు న – వ్వేరా వేణుగోపాల। రారా।

కద్దా ఇట్లాడాయము – కద్దా యిక మోములు చూడ
వద్దా దానిగామాయలు నీవద్దా
దాద్దు పెట్టినచ్చెనని కన్నులు – దుద్దు వ్రాసి దానికి బంపినముడి
ప్రొద్దున పిలిసి నంతో మమూ మొసద – ప్రొద్దుకాడ నెవరైనవినేరు। రారా।



" పిలుచుక రావమ్మ - సామి నీవేళ "

— పేజి 8 - పదము 12

మందు రాచినదేమో యికనే – మందు రా దానియింట
విందు రాతిరి బోసేసితివట – విందురా చెలులు
సందురా నన్నేవారికి మన – సందుగా నీకు యేలా
గుందురా రా నినుజూడక నామది గుందురా సుందరాకార॥ ॥ఏరమా॥
మెత్తురా నాపేరంటె శివ – మెత్తురా చెలికి ఇటుచను
విత్తురా కాపురాలవేరు – విత్తురా నాసామీ
ఇత్తురా ఒకనాటికి మొలతా – యిత్తు రాచ్చలకే మరి యెడ
మిత్తురా మునుపటి దయరా నే – మిత్తురా వృత్తరవ్వలేల॥ ॥ఏరమా॥
ఏలరా దానిగూడినట్టువలె – ఏలరా నన్ను నేగుణ
శీలరా నీవా చెలికెంతవ శీలరా చలము
చాలురా వెలదికి రేపేనా – చాలురా అది జెప్పినమాటనే
పాలుగా కలిగినదంటే కో – పాలురా మేలురానీకు॥ ॥ఏరమా॥

## 14. పున్నాగవరాళి - ఆది

పల్లవి – ఎంత దుడుకుజేసెనే – ఓ భామా న
　　న్నెంత దుడుకుజేసెనే
అను...ఎంత దుడుకుజేసె – నెవరితో దెలుపుదు యీ
　　వింత కార్వేటినగర – వేణుగోపాలరాయ॥ ॥డెంత॥

గంటీలుబెట్టి వాలు – గంటీ నామోవి పలు
గంటీలు జేసిన త్రాణ – గంటివేమే
యొంటిపాటున యిటు – వంటి పనులయితే ర
వ్వంటికమ్మ చెల్లనా – వంటివానివి గాని॥ ॥రెంత॥
అక్క పిలవే వానిని – అక్కర బంగారాము
అక్కర లేదు పొమ్మంటె – అక్కసుతో
చక్కపొమ్మ్యవా యని – చక్కని నాగుబ్బలు
చక్కగా బిగబట్టి – చక్కన్లెన్నో జెప్ప చు॥ ॥ఎంత॥

పట్టుచీరకు పళ్ళి – పట్టు వరహా లయిదు
పట్టుమనుచు నాచై – పట్టుకొని
కట్టుకొంగున మూట – గట్టుకోవే యని యి
క్కట్టు గూడిరా – కట్టు వుంగరమిచ్చి॥ ॥ఎంత॥

### 15. పున్నాగవరాళి – ఆది

పల్లవి – మట్లవారిసీమ చీర నిను పది
మాట్లడిగిన లేదంటివి బంగరు
అను... గెట్లు దానికిచ్చితి ఏక నీ సి
గ్గెట్లుదక్కె వేణుగోపాల॥ ॥మట్ల॥

కట్లసంచిపొరలో దాచిన – కట్లదండకూడా సణతిచే
కట్లకిచ్చినదినే తెల్లవార – కట్ల వింటిజాడా యీ
పట్లదే యోగశాలిగా వినే – పట్లమోచి గూడా సే
కట్లయిండ్లు విడిది చేసితివా – కట్లమారి గుడికా॥ ॥మట్ల॥
రాళ్ళమర్చిన పతకము పావు – రాళ్ళ పలుకు కేరా వే
మాళ్ళ పచ్చదారబోసినది పెరు – మాళ్ళ ప్రీతిగానా చె
క్కిళ్ళసొరు మెచ్చి యిచ్చినది యొక – కిళ్ళమంచమేనా నీ
వేళ్ళ వుంగరాలేసిగా నట్టి – వేళ్ళ చప్పరములోనా॥ ॥మట్ల॥
కేళికాశితేనే చెలితో రతి – కేళి సల్పనగునా చిరా
యాళి మొగము నీదెరాతి – గయ్యాళి కియ్యనగునా
తాళిమితో ననుగూడి యింత మొగ – తాళి సేయనగునా అ
చ్చాలిగా సుదతిచేతనే పద – చాళి చిత్తగించితి వీవగనా॥ ॥మట్ల॥

### 16. పంతువరాళి – ఆది

పల్లవి – గావద్దు పొమ్మననా – మాయింటికిరావ వద్దు పొమ్మననా
అను... పోవే మాటలమారి – ప్రొద్దుపోదేను నీవు
యీ వేణుగోపాలు – డిట్లా చేసెనా॥ ॥రావద్దు॥

మళ్ళచీ గడిగితే - మళ్ళా వచ్చెదనని
మళ్ళాకోసపోయి మారా - మళ్ళ బెట్టినందుకు॥ ॥రావద్దు॥
కొొదనేమున్నదనుచు - కుదువబెట్టి నాతీగ
కొొదవపరచి నామనసు - కొొదవ సొమ్మడిగితే॥ ॥రావద్దు॥
అక్కరకరావ్యోవని - అక్కరో ననుకూడి
అక్కడె ఆసుకుంటె - అక్కరలేదిక॥ ॥రావద్దు॥

## 17. సౌరాష్ట్ర ఆది

పల్లవి - మందగమన చెలుల - మందగ గూర్చేవు
మంచిది కానీలేవే

అను...అదరన్నట్లు నన్నారడిచేసేవు
అందరానిపంక్తి - కాసించిన ట్లాయె॥ ॥మంద॥

కనకాంగి మరచేవు - కలకాని వన్నది
వెనకలేలంటె ఆ - వెనక దెలిసీని
వినక నామాట న - వ్వినకారణము దెలిసే
దనకపోనీను నా - దనకత్తె వైనావు॥ ॥మంద॥
నేరమా వలచితే - నేరమా నీవలె
మారామళ్ళమె రా - మా రామయిపుడు
దూరమ నీమనసు - దూరమైనందుకు నే
దూరమా నీయింటికి - దూరమని బొంకుచు॥ ॥మంద॥
వాలాయముమిడె ర - వ్వాలాయె నీకు కో
పాలాయె యిది ప్రస్తా - పాలాయె కొసరి
చాలాయె నినుగూడి ర - చ్చాలాయె వేణుగో
పాలా యుంక నా - పాలాయె మజిమిజి॥ ॥మంద॥

## 18. ?గడ - ఆది

పల్లవి – ఎందుకో రాక అలగినది నా
యందు కోపమేమి తెలుపవే ఆది

అను. . .సందుకొనెను వేణుగోపాలుడీ
సందు కొనకువచ్చి మళ్ళినాడట॥ ॥ఎందు॥

వచ్చునా కీగుణ మేమన – వచ్చునా నెనరుదోచి దరిశన
మిచ్చునా దయవుంటే చెలికన – మిచ్చునా న్యాయ
మెచ్చునా యింకా నాపై చల – మెచ్చునా బోటి కపట నాట
నిచ్చునా వకరిమాట సాగ – నిచ్చునా దైవమింతజెచ్చునా। ॥ఎందు॥

తిరుగా నిలచి వార్తలాడ – తీరెనా లోనిగుట్టుజెప్పి
తీరునాటించి నటుల యున్నది – తీరునా యిట్లా
మీరు నా డన్నది నిజమాయె – మీరునా యింత నా ప్రేమ
దూరునా మీదబెట్టి దానిలు – దూరునా కోర్కె లీడేరున॥ ॥ఎందు॥

ఏలనా పేరు వాసి తిరుగా – యేలనా కాసి నేనంత
చాలనా తనకంటికి సమ్మతి – చాల నాటనుంచి
మేల నాతోజెప్పని మర్మ – మేల నాసనివాలోనే
బేలనా యడిగిరావె తబ్బి – బేలనా మది సహింపజాలను॥ ॥ఎందు॥

## 19. హుసేని - ఆది

చక్కని సామిగ నాతో – చక్కగ నుత్తరమీక
చక్క దానింటికి పోదురా నీపరువు కిది – చక్కని నడితి కాదుర॥
తీగని మోహమున వలచి – తీ దావచ్చేనని ఆన
తీర నీవు మేలుదాననా పనియున్నది రా – తీరపనే సుద్ది మానరా॥

మానవతి మెచ్చి నీ స - మాన మెవ్వరని బహు
మానము జేసినది వింటిరా రాగారాగా నీ - మానసము దెలుసు
కొంటిరా॥

నాటినమ్మికెలు మది - నాటియుండదా నన్ను యే
నాటికీ యెడబాయనంటివి - ఆపె యెదుట నిన్నాటి కెంతో కసరు
॥కొంటివి॥

నగరా చెలులు శ్రీకార్వేటి - నగరా వేణుగోపాల తి
న్నగ రాదీసి యేలుకొంటివీ వాదాడితేయీ-నగరాబుట్టినీ మాటంటివీ॥

## 20. అసావేరి - ఆది

ఏరా యేరా మాబోధింప
రారా రా రాపూసేయ వ
ద్దూరా దూరాన నిలుచుందురా - సీమదిరా నడి
చేరా చేరా రావేమందురా॥
నిన్నా నిన్నాడుకొన్నది
విన్నా విన్నాణగత్తెను
కొన్న కొన్నపతకమిత్తునా - నే దానికంటే
చిన్న చిన్న పనులుమెత్తురా॥
వద్దా వద్దా రావుయొక్క-
పొద్దా పొద్దాయనే యిట్లా
కద్దా కద్దాచెలితో ఆటలు - యేవేళయిదే
రద్దా రద్దాయె నీమాటలు॥

కానీ కానీ నీబోటిసత
మానీ మానితీవి దయ
రాని రానీదు మాయింటికి అది జెప్పినట్లు
పోనీ పోనీదు పొరుగింటికి॥

ఇందు యిందుముఖులు మెచ్చ
ముందు ముందుగాగూడినా
యెందు కెంతకెంత కోపమూ - వేణుగోపాల
సందు సందుల ప్రస్తాపమూ॥

## 21. ఆహిరి - చాపు

పల్లవి - వేఱుసేతురా - వేణుగోపాలా నను వేరుసేతురా
అను...నీరాక కోరిన నన్ను - నిరాకరించి పొమ్మని॥ ॥వేరు॥

ఇందుకా నీవని నమ్మినది - యిందుకా నీ వనితలలోన॥ ॥వేరు॥

అంతటి రాని రసికత - యింతటివని దెలియకా॥ ॥వేరు॥

పూలుగూర్చిన వగజూచి గుం - పూలు గూర్చిన వగలాడివచ్చె॥ ॥వేరు॥

మానినిభయాన తారినందుకు నే - మాను నిభయానలు నవ్వగా॥ ॥వేరు॥

నిలుపరా నీమోహమాయు - నిలుపరా నీమోడి యికను॥ ॥వేరు॥

నిన్న నేమిరా మోచన వింటె - నిన్నన నేమిరా ఫలమింక॥ ॥వేరు॥

పాయమున నే మేము పు - పాయమున నే నన్నుగూడి॥ ॥వేరు॥

## 22. కన్నడ - ఆది

పల్లవి - తిరుగాయే చెలిని పొమ్మందునె - వేణుగోపాలునే
తిరుగా పిలచి రమ్మందునే

అను...తిరుగా వల దన్నందుకే వళ
తిరుగాబోయె వానిమనసు॥ ॥తిరుగా॥

మందారవనములో నేడు - మందధరునివద్ద
మందర జేరినదట మే - మంద రాడకు పోతగదు॥ ॥తిరుగా॥

వద్దనేమారని విభుని - వద్దనేల పోపొమ్మంటి
వద్దానేర్పు చేరదీయ - వద్దనే రీ మగువలెల్ల॥ ॥తిరుగా॥

వచ్చునా తానైనను కలయ - వచ్చునా ఆడికెలు తెలియ
వచ్చునా అతనీమది గురుతీ - వచ్చునా శుభ రేఖ వ్రాసి॥ ॥తిరుగా॥

## 23 ఫరజు - చాపు

పల్లవి - రమ్మనే సామిని రమ్మనే
అను...కొమ్మ నీవే నాకునవి గై
కొమ్మని వేణుగోపాలుని॥ ॥రమ్మనే॥

మచ్చు మీద నేనుండగ - మచ్చుమీద జల్లినవాని॥ ॥రమ్మనే॥

ఇందుకాక కోర్వదంటె - యిందుకా కసరెం దీవేళ॥ ॥రమ్మనే॥

అలసీ మాటితో రేయెల్ల - అలసి మాటాడకున్నాడు॥ ॥రమ్మనే॥

కూడిన సామిని నీతో - కూడిన నాపై పయియుంచి॥ ॥రమ్మనే॥

## 24. కాపి చాపు

పల్లవి – తడవాయె పోయిరా యీతడవా – యేమే
అను...పడతీరో వేంఱగో – పాలు డచ్చుటజేరి॥ ॥తడ॥

మనవి దెలిపి రా రమ్మనవే కూడి
దనవొచ్చే బుద్ధి గాదనవే నాపై
కనరు దోచుట కేమో కనవే వో
వనజాక్షి ఘట్టిగ వకటి నీవనవే॥ ॥తడ॥

వలచించే తప్పు నావలనా అ
గ్గలమైన మగు లోర్వగలనా ఆపె
వలెనున్నానటు నేకావలెనా క
ల్లలకు లోనౌన చల్లనివాడె లలనా॥ ॥తడ॥

సతి యిల్లాతనికి వసతిగా మాన
వతి చాల ననుకూలవతిగా అది
మతిగలదై తే సమ్మతిగా యెంతో
మితిలేని ప్రేమ సామికి మే నమ్మతిగా॥ ॥తడ॥

కలదా రానిచ్చేది గలదా మా
వలదానిఎడక లోపలదా యీ
వల రాను సెలవు కావలదా తే
గల ధైర్యముకు నీకుఘట్టిగ గలదా॥ ॥తడ॥

మరు కేళి గూడినది మరుగా నీ
వరుగ చెలులు సవ్వడిగ వ
క్కరు మనకై పలుకరుగా యెం
దరుగవలెనే సుందరి నేడిందరుగా॥ ॥తడ॥

## 25. ఫరజు - ఆది

పల్లవి- ఆడకే పోరా - యెదు - రాడక పోరా

అను...వేడుక లీడ జెల్లవు - వేణుగోపాల నా సామి॥ ॥ఆడకే॥

వాతెర విందుసేయ నె - వ్వాతె రావించె నన్నదా॥ ॥ఆడకే॥

చీటి బంపిందేని బందరు - చీటి బంపిందే మగువకో॥ ॥ఆడకే॥

పూలుగూర్చిన వగలుజూచి గుం
పూలుగూర్చిన వగలాడెవతో॥ ॥ఆడకే॥

ఏదు వరా లిప్పించుకొన్న ఐదువరాలి యిల్లేడనో॥ ॥ఆడకే॥

కూడిన నాటనుండి చే - కూడిన నాపై దయయుంచి॥ ॥ఆడకే॥

## 26. భైరవి - ఆది

పల్లవి- సరసాలు సేయవద్దిక చాలు పోపోరా

అను...సొఱతురా నీపేరంటె - వేణుగోపాల నాసామి॥ ॥సర॥

పచ్చని కమ్మేలచీర-పండుగనాడైన యెరుగ-
వెచ్చానికేమి లేదంటె - వెలవెలబోయి నాతో॥ ॥సర॥

మంచముమీది పాదాలు - దించనీకు పదిరూకల
కంచము దీసియమంటే కండ్లెఱ్ఱజేసుకొనేవు॥ ॥సర॥

ముత్యాల కుళ్లాయి మాకు - ముందర బెట్టేదిశానా
యిత్యాహాభట్ల నామేలు - యిక నిన్నుగూడేవె సున్న॥ ॥సర॥

## 27. భైరవి - ఆది

పల్లవి- వచ్చునా మునపటి నెనరుంచి - వట్టిభ్రమలు గాకా

అను...మచ్చకంటి వేణుగోపాలుని
మనసు రానడిచే వారుండగ॥ ॥వచ్చు॥

పిలువవచ్చేనని యంతో మురి - పెముల పొయ్యేవు - వాని
తలపు వేరైన జాడ కానం - లైన తెలియలేవు
వెలదిరో యతని జిత్తుల నీ - వేమిగన్నావు వో
వలినచెలి త్రివిభుని కేవహెంచుక
నన్ను కాదనేవు మంచిదానవు॥ ॥వచ్చు॥

మాటపట్టు చేసుకొన్నారట - మగువ తాను మొన్న నన్ను
నోటిలో నాడుకొన్నారట - కోటివేలు నిన్నా
బోటి యీసుద్దుల్ల జెప్పగ - ప్రొద్దుపనే నిన్నా - యీమొగ
మాటమే దూరమాయె చెలువుని
మర్మమెల్లగన్న వేడుకొన్న॥ ॥వచ్చు॥

నన్ను లాలించి యేలుకొన్నది - నవ్వుల కెడసాయె - ఆ
వన్నెకాడు నాయిల్లు విడిచినదె - కన్నెల పరసాయె
నన్ను తాంగి పొందే నాసామికి - సంతోషమాయె యిక
నెన్నిదలచుకొందునమ్మ నాయది
కేమితోచదాయె నన్నుడాడు॥ ॥వచ్చు॥

## 28 భైరవి – ఝంపె

పల్లవి–ఇంతసేసినయింతి యిగ నెంతసేయదే
యెంత సాహస మందునే–
అను...వింతలేమనవచ్చు – వేణుగోపాలునికి
సొంతకత్తెయకదవే సకియ॥ ॥ఇంత॥
సుదతిరో నసువిభుడు చూడబొయ్యేననుచు
సురటీలు బట్టించెనే వాని
కెదురుగా నొకవేళ నేవత్తునని దలచి – యేమొ జాబందిచ్చెనే–
షదము నేబాడితే సదయున వినకుండ
భటులచే బొగడించెనే– యెవరు
సవరు లేదికమీద నావేలు పంచరని
మదిలోన గర్వించి నేనకియ॥ ॥ఇంత॥
అతివరో నామాట లాలకించీ ననుచు
నపుడె చిలుకను బెంచెనే– నన్ను
మతిలోన దలచునని ప్రతిమ నొక్కటి చిత్ర
పటములో వ్రాయించెనే–
వ్రతమనుచు వగకానివద్దికే చెలుల రా
వద్దనుచు చాటించెనే –యింత
మితిమీఱి యిద్దఱి మిత్రభేదము జేసి
మేలుమెచ్చులు గాంచెనే సకియ॥ ॥ఇంత॥
సామి ననుగూడినది యేమగువ దెలిపెనో
యామొదలు వలపెట్టెనె అంగ
నామణి యయి నంగనాచివలెనుండి య
న్యాయాని కొడిగట్టెనే
రామరో యతడు తన రతిసాదనకు మెచ్చి
రాణివాసము చెట్టెనే వినదే
వామనేత్రి విభుని వల వేసుకొంటినని
వగలాడితొడపట్టె వేసకియ ॥ఇం॥

## 29. భైరవి - ఆది

పల్లవి - నా పేరంటె నీకు గారకదు, గంగి మాటలాడకులేరా

అను...దోవనే సకిరో నొక్కటి ఆ

దొరసానికా వేణుగోపాల॥ ॥నా పే॥

తలుపుచాటున చిలుకలతాళి - దానికియ్యలేదా - పూసల
కొలుకి నేయుమన్నందుకె నాపై - కోపగించలేదా
పులిజున్ను పుట్టతేనె మొదలుగ - చెలికి నడపలేదా - నీకు
వలసియున్న పనులైతే మదిలో -తలచినప్పుడె కాదె
అందుమీద॥ ॥నా౨॥

వారపప్పళిచీర దెచ్చె - వాడవానీవు - నేటి
కాను దినములాయె తొంగిచూడక - నందే యున్నావు
తేరతేరగా జూచి యెందుకు - మేరచెప్పెనప్పు - అంత
భారమై తోచితె నికనా - వద్దు జూచెదవు మాయకాడవు॥ ॥నా పే॥

వగలమారి నన్నంటకుమంటే - వద్ద చేరావు - ఆ
మగువ నిన్నేలుకొన్న చిన్నెలు - మరుగు జేసేవు
సొగసు జేసుక సను తమి రేచి - సొంపునను గూడేవు నీ
తెగువ దేవేంద్ర పదవైన.. - తెలియజేసేవు- మంచివాడవు ॥నా పే॥

## 30. నవరోజు - త్రిపుట

పల్లవి - వేణుగోపాలు డేవేళవచ్చినాడు

వేమారు గొణుగకవే - వాడు! ॥అంబ॥

అను...మాణిక్యపుతొడనకే పాన్పైమెనీమీద

యేణాక్షివినవే నేడింతో హాసుమీఅవే ॥వేణు॥

దగ్గరికటుజేరి దండముబెట్టవే - సిగ్గేటికే యింక చిన్నదానహో

యొగ్గుగా దోచి నీవిటు తలవంచేవు

దిగ్గున మొగమున తెలివిదెచ్చుకోవే॥ ॥వేణు॥

ఏలనే కూతుర మూలలజుణిగేవు

నేలమీద బోటనవేలు రాయకే॥ ॥వేణు॥

పూలలందుకొమ్మంటే పుడకేల విరచేవు

మేలు వానిచేత మెచ్చు లందుదుగాని॥ ॥వేణు॥

చప్పుడుసేయక సాగిటు రావమ్మ - యిప్పుడేమె నీకు యేండ్లులేవా

చెప్పినంతమాట చెల్లించేసామిని

అప్పుడే రతివేళ తిప్పలబెడితివే ॥వేణు॥

## 31. తోడి - త్రిపుట

పల్లవి - తోడితెచ్చెదనే వాని - అప్పుడే మెచ్చి

తోడవు లిత్తువుగాని

అను...వేడుక పరుషైన వేణుగోలుడల

చేడె నగరిమున్న - జాడదెలిసి యీడకే॥ ॥తోడి॥

అద్దము జూచుచును ఒకరికొకరు

ముద్దులు బెట్టుచును

గద్దరితమున కౌగలింపుచు నీపై

పద్దున దానికి - బాసలిచ్చినగాని॥ ॥తోడి॥

మనసుపు లందిచ్చినను - ఒక్కరికొకరు
తొడరి మోవి నొక్కుచును
కడలేని మోహమున - గంధమలదుచు నాపై
పడకింటి యిష్టాలా - పముల నుండినగాని॥ ॥తోడి॥
వీణెలు మీటుచును - ఒక్కరికొకరు
జాణతనము లాడుచును
మాణిక్యమువంటి - మగువ నన్నేలిన
వేణుగోపాలుడా - కలసి గూడినగాని॥ ॥తోడి॥

## 32 నీలాంబరి - ఆది

రారా సామి నీకు మ్రొ - క్కేరా పిలచిన పలక
వేరా నిలచి వొకమాటాడర - నిన్నెంతో చూచు జా
లారా చలముల యింటికి రారా॥
వాదా కనికరమింతైన - లేదా యీ మేనుని దే
కాదా నీకోరిక దీర్చ - రాదా తమినిల్వ లేనిక
మీతూ తడవేల సరకు రారా॥
వేరు సేయకుర కాద - నేను తోడి చెలులును
న్వేరు యెవరైన గూటున వ్యాధి - యోలేని వేడుచు పలు
మారు నన్నాదుకొందువు రారా॥
ఓరీ యెంతో నమ్మది నిను - కోరీ నలచినందుకు వక
సారీ రావైతివిగా యీ - దారీ ఫలమేమిక నిన్ను
దూరీ యిపించి నమయమును రారా॥
కాయజుకెంతో పగవా - ఱాయ నీమనసుకరగ
మాయ నిందనవా - ద్గాయ వేణుగోపాల
రాయా నన్నేలుకొందువు రారా॥

## 33. శంకరాభరణ – త్రిపుట

పల్లవి – ఇంత మోహమేమిరా – యిందరికన్న
నింత చక్కని దేమిర

అను...సుంతసేపు దాని – జూడకుండలేవు
అంతరంగము దెలుప వదియేల – వేణుగోపాల॥ ॥ఇంత॥

నీ కెదుగావచ్చునా – నెనరూరగ – నిండుకౌగిట గ్రుచ్చునా
ఆకుమడువు లందిచ్చునా – తనచెలిమికి
నైనవాడని మెచ్చునా – తమి హెచ్చునా
యేకచిత్తమున మీరిద్దరు – యింపు సొంపులనున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యేరా – యిపు డాసతీరా॥ ॥ఇంత॥

మోవి పానకమిచ్చునా కొసరికొసరి – ముద్దులాడ నిచ్చునా
తావిపువ్వులు దెచ్చునా – నీ సొగసుకు
తగియున్నదని యిచ్చునా – చనువిచ్చునా
దేవరే మగడు గావలెనని – భావజుని పూజ లొనరించిన
ఆవనిత పేరేమి సెలవీరా – సిగ్గేలలేరా॥ ॥ఇంత॥

సంతోషముగ నాడునా – తంబురమీటి – సంచు పాట పాడునా
వింతరతుల గూడునా – ఆ సమయాన
విడువకుమని వేడునా – కొనియాడునా
సంతతము నన్నేలుకొని యా – కాంతపై వలచినపుడే యిక
కొంతవున్నదె వేణుగోపాల – గారణములేల॥ ॥ఇంత॥

## 34. పున్నాగవరాళి - చాపు

పల్లవి - సామి యీకోపమేల - దాని జేరకుమంటే గోసాలా

అను...కామినీజన పాంచాల
కార్వేటినగర వేణుగోపాల నా॥ ॥సామి॥

నెనరుగూర్చి యేమైన - నే నొకటనరాదా - ఆది
కసరుగాదో చేసి మానక - కాంగి మహిమగాదా
చనవరి నీకదైనప్పుడే చాలదా యికమీదా
మనసురాక మెలగే విని - మంచిమరియాదా నా॥ ॥సామి॥

అమ్మ చెల్లనీనడతలు - ఆనాడే గంటి - ఆ
కొమ్మకు వెలలేని వెలసొమ్ములీయ వింటి
దిమ్మరివలె యిల్లిల్లు దిరుగ వస్తంటి
యెమ్మెగాడు మంచివాని - కీ గుణమువంటిరా॥ ॥సామి॥

చెలియపొందు సేయకేరన -చ్చై నేసేవు - గుజువులు గా
కలదనిపించితె - ఊసముగా తొలగేవు
తలిసుబోణిరో యీతప్పు -దయసేయు మనేవు
అలగియున్నగాని గూడి - అప్పుడే సన్నించేవునా॥ ॥సామి॥

## 35. శహాన - త్రిపుట

పల్లవి-నేగలుగని మాటలాడరాకు మునుపే - నిన్ను నేనెరుగనా

అను...పోగా పోనీకేమి - పొద్దుపోక తిరిగేవు
వూరలేనివారిని పేర బిలుచుకుంట॥ ॥నేరు॥

మూసిన ముత్యమువలెనున్న యాచెలిని
　ముంగిళ్ల బెట్టితివి – యెంతో
వాసివాడని చాలవలచియున్న నాతో – వాదు కొడిగట్టితివి
భాసురాంగి నిన్నపడకకు రానంటె – పదివేలు తిట్టితివి – అగడు
జేసెదనని పూని చేడె లందరుజూడ
　చెలియిల్లు మెట్టితివి – చేబట్టితివి॥　　॥నేరు॥

అనుగులోనే యరవై యారు గుణములై తే
　అభివలు మనసిత్తురా – ఆకు
మనుపులోనే వలపుమందుంచి మాపొరుగు మానినీమణి కిత్తురా
దుడుకులు సేయ నీదొడ్డతనమేమో
　దొరవై తేనే మెత్తురా – యింత
గడిదీరి తిరిగితే కన్నెలు వాకిటి – కైన జేరనిత్తురా
　మొగమిత్తురా॥　　॥నేరు॥

వేడుకలొదవు కార్వేటినగరమేలు – వేణుగోపాలుడవు – చిన్న
యీడున నను గూడి యీదోవ రావైతి – వింటింటి చెందు్రిడవు
ఆడకాడకు నీజాడలు బయలాయె – ఐనా మాయకాడవుయిట్లా
కోడిగములు జేసి కొమ్మల బెదిరించి
　కొంటెతనము ఏడవు మాయకాడవు॥　　॥నేరు॥

## 36. పంతువరాళి – చాపు

పల్లవి – వలచియుండితే నీవు – వలచేది ఘనమా
అను... వెలది కార్వేటినగర – వేణుగోపాలుడు　　॥వలచి॥

అంతజేరి వేడేరి అత్త ముద్దిమ్మనేది
వుండివుండి తమకమున – వుస్సురనేది

యెండమావుల సామ్య – మేమనుకో రానికను
కొండకేగేవాని మొలను – కోడవలి చెక్కినట్లాయె ॥వలచి॥

కడుప్రేమ బుట్టించేది – కదిసి కౌగిలించేది
తొందరి మోవి నొక్కేది – దొరి వనేది

మడువు లందిచ్చేది – మనసు రాదనేది
పడతి పులగము మీది – పప్పుసామితె ఆయె ॥వలచి॥

మేలు మరువ ననేది – వేళ మంచి దనేది
పాలుమాలక విటుని – పైకొనేది

రాలుగాయనగ వుప – రతుల తనియించేది
ఆలిమీద లంజరికమనుమాట నిజమాయె ॥వలచి॥

## 37. పంతువరాళి - ఆది

పల్లవి – దోసకారిపోవే యతడే – తోరివ దొరుక్కునా – స్వామికై

అను...ఆసుబోసిన కోవివలెనే ఆశను యీసను
తిరిగేప్రమాత్రిమె॥ ॥దోస॥

అందమైన వెండిమెట్టెలు – సందెకాడ బంపించినే
కందుగలసిందని మెగిరి – చిందులు దొక్కును చిలుకగొట్టిన ॥దోస॥

కరకు వరహాలారుబెట్టె – కరకంచు చీరదీసిస్తె
చెంగు బాగాలేదని మెటికలు – విరిచి నుష్పపాతలు కేసెను ॥దోస॥

సన్నబియ్యము లేనివాసి - సంబావ్వడ్ల గోనెలంపితె
కన్నులెఱ్ఱజేసి గింజ - లన్ని కుంపట్ల కెత్తించిన॥ ॥దోస॥

కలువపూలు లేని వాసి - కస్తూరి పట్టెలంపించితె
తిలకించికోపమున చేత - నలిచి పందిటిమీద జల్లిన॥ ॥దోస॥

వేణుగోపాలుని గూడి - వేలాంత్రాలు సంపాదించి
యేణాక్షులతో వకకాసైన - యెరుగననుచు వాడుకొన్న॥ ॥దోస॥

## 38 గౌళిపంతువరాళి - చాపు

పల్లవి - చండితనము జేసే - సరోజాక్షితో యిట్లా
సరసాలు సేయకురా - ఐనా

అను... కొండ ద్రొవ్వలుకను బట్టుదురా వేణు
గోపాల నేనంటే - కోపాలా యే వేళ॥ ॥చండి॥

ఎక్కడలేని మోహముతో దాని - పక్కజేరి పాదములంటితే
గ్రక్కున లేచి చిడిముడిపాటున - గద్దించి పలికేనుగా
మక్కువతో నాకుమడుపు లీయబోతే
నక్కరలేదని యావలి మోమాయె
జక్కుల సంతోషమనుమాట నిజమాయె
చక్కిలిగింతలు చటాత్రికి గలదా॥
రాతిరీవు గుజరాతి ముత్యపుసరులు
చేతికిత్తామని ప్రీతితో బిలచితె
ఘాతకురాలు గొణగుచు నీమీద - కండ్లెఱ్ఱ జేసెనుగా
పాతకురాలు నీబంపిన పైడి - పట్టె దేలేదని యాన లిడుకొనె

చూతామనుచు సన్న వేతామాయంటి
  యీతాకురాలున యేయాకు రాలిన॥

ఉయ్యాలమంచముపై నిన్నటిరేయి
  పయ్యద తొలగించి పణతి నిద్రించగా
చయ్యన నీవాసమున్నాన బలిమిని - సమరతి గూడగనూ
అయ్యెడ తెలివొంది అధికకోపమున
  గయ్యాళి తనవామకరమున నెట్టించె
నెయ్యము సేతుర నెవరులేనిచోట
  కొయ్యబొమ్మను చేర కోరకెలిచ్చున॥

## 39 సురట - త్రిపుట

పల్లవి - ఇంటికి రానిచ్చేనా - యీమేనితో
  యింతి వాని వలచేనా

అను... గొంటుకాడై వేణు - గోపాలుడు నాపై
  తంటలు జేసితె - దండించక విడచేనా॥ ॥ఇంటికి॥

యితనికి నెరచినే - నిక లంచమిచ్చేనా
యిన్నాళ్లవలె ననుసరించేనా
బతిమాలి నే గాయ - బారమంపించేనా
పతియని మునుపటి - భక్తి దయలుంచేనా॥ ॥ఇంటికి॥

ప్రేమ దలచి తన - మోమైన జూచేనా
యేమి జెప్పిన నిజ - మెంచేనా
రామా అయినది కాని - రచ్చకు నడచేనా
ఆమాట సభలో నే - ననక సహించేనా॥ ॥ఇంటికి॥

ఎనసిన మొగమాట - మింతైన జూచేనా
యెంత వేడిన మన - సిచ్చేనా
వనిత పట్టినపట్టు - వట్టి దనిపించేనా
పనిబూని వేణు - గోపాలా యని పిలచేనా॥ ॥ఇంటికి॥

## 40 ధ్వజావంతి - త్రిపుట

పల్లవి - నెరనమ్మితిగదె - నీమాట సతమని
నెనరు దానవనుచు

అను...మరులు బుట్టించియేమరి యూరకున్నావు
గురిజేయకె నన్ను - మరుబారి కిప్పుడు॥ ॥నెర॥

మాటల పందిలిబెట్టకె నీవయిని - నాటియున్నదే మనసు
బూటకములుజేసి - ప్రొద్దులు బుచ్చకె
తేట కెమ్మోవీవె - తేనెలానగనీవె ॥నెర॥

అరచేత వైకుంఠమదిగో యందు రా సామ్య
మంతియు నిజమాయనే
మరిమరి చనువిచ్చి - మనసీక జాణిగేవు
సరస జేయగరావె -చనులు బట్టనీవే॥ ॥నెర॥

నమ్మి నానబోసినటులాయగదె యల్ల నాటి సంకేతములు
కొమ్మరో నను వేణు - గోపాల రమ్మని
కమ్మవిల్తుని కేళి గలయవేమె బాళి॥ ॥నెర॥

## 41 శుద్ధసావేరి — త్రిపుట

పల్లవి — త్రాణబావన వాడిం — తగా ఒకినూలితే
తలయెత్తి చూడరాదా — నీపై
అను... వేణుగోపాలునికి — వెగటుదోచితే రేపు
వేకరేలాగౌదువే యోచెలియరో॥ ॥త్రాణ॥

ఇందు కేనటే బంగా — రంపలమ్ములో బెట్టి
నందేలవార నిన్ను — సజరు బంపినది
అందకాడు గుబ్బ — లంట వచ్చినవేళ
చిందులు త్రొక్కుచు — చెయి బట్టుకోవలెనా॥ ॥త్రాణ॥

మిద్దెయిల్లు గట్టి — మేలు మెచ్చుగజూచి
హద్దుగా వుంచినది — అందుకే నటవే
పద్దికి తావచ్చి — వలపు రేచేవేళ
ముద్దు బెట్టుకోనీక — ముణుకుకొని వంగుదురా॥ ॥త్రాణ॥

పడతిరో వేణుగో — పాలు పెద్దమారేయి
విడివికి వేంచేసి — వేడుకలరగాను
తడయక నిను సఖుల — తమిని గూడేవేళ
బెడసరమటే రెంకు — తొడ లదుముకోవలెనా॥ ॥త్రాణ॥

## 42. కేదారగౌళ - ఆది

పల్లవి — నేము నీవిన్నవించినందుకు
నేనటు బట్టరాదా — యెంత
అను... వేడుకై తోచెనే నాన్నసికి
వెలది వేణుగోపాల దేవునికి॥ ॥నేడు॥

నిన్నుబాసి నిమిష మోర్వనంటివి - నీ సొమ్మంటివి
కన్నీరున పైట దడిసెనంటివి - కారాదంటివి
వున్నతావున నుండదంటివి - వులికీనంటివి
చిన్నబుచ్చితే దోసమంటివి - చిత్తానికి సరిపోయినదంటివి॥ ॥నేడు॥

చిలుక చాయ తొంగి చూడదంటివి - చెప్పదంటివి
చెలులదగ్గర జేర్చదంటవి - తలచునంటివి
వెలవెల బోవుచున్నదంటివి - వెరచునంటివి
పిలచిరమ్మనె రారా యంటివి నెలత నీకెదురు జూచునంటివి॥ ॥నేడు॥

కూడి వీడ తగవు గాదంటివి - వేడుకొంటివి
మోడిసేయ మర్యాదా యంటివి - మ్రొక్కితినంటివి
చాడిసుద్దులు వినవద్దంటిని - సరసుడవంటివి
ఆడికలకు యడమీావలదంటివి - అలుకదీరి యింటికిరమ్మంటివి॥ ॥నేడు॥

## 43. హుసేని - ఆది

పల్లవి - తెలిసె నీనెనరులేని జాడలు - తేటతెల్లముగను
అను...వలదు నిలుపు యీామాటలకేమి
వచ్చె వేణుగోపాల నాసామి॥ ॥తెలిసె॥

మనసుగలిగితె దినమొకసారి - మాయింటికి గావా - యెంతో
చనువుమీార కౌగిలించి ముద్దిడి సరస నుంచుకోవా
తనివిదీర లాలించి కప్పూర - తావి మడుపులీవా యీా
తనువు నీదని జేసిననమ్మిక - తప్పనలేకావ - కొంచగాడవ॥ ॥తెలిసె॥

ఊరిదాక పోయివచ్చేనని గ్గారికె అనలేదా అయి
దాస దినము లిందుండే మోమొక - సారి జూపరాదా
వారిజాక్షి హితవైతే నేనా - పేరు వలచనిదా - క
న్నీరునించి దయవహించుమన్నది - నీతో నేగావ
మర్యాద॥ ॥తెలిసె॥

కూడియుండ లేదా నను మెచ్చి కూరిమితో నీవు - యిపు
డాడకాడ కేమే మోసల మక - అంతరంగమిావు
జోడుచాయలేనని బతిమాలితె వేడవలద నేను నా
యీడువార లెకసక్కెములాడుట - కింత జేసినావు
మంచివాడవు॥ ॥తెలిసె॥

## 44. ఖరజు - చాపు

ఎంత వేడుకొన్న పలుక - డేమి సేసుకొమ్మా
ఇంత గాతిమనసువాని - నెందు గానవమ్మా॥
చిటుకుమంటె కోపమైతె మోములవైబినమ్మా
కటకటా వైనమింతె కమా దప్పినమ్మా
మాయదారి నగలకెంతో - మరులైతినె కొమ్మా
బాయనను చిన్నినాడ - బాస లిచ్చినమ్మా

గచ్చులాడి నాపై ఎళి - గల్పించె గదమ్మా
మచ్చుజల్లి నాదువిభుని - మనసు విరిచేనమ్మా
వేణుగోపాలుని కది వేడుకాయె నమ్మా
జాణనను మగువొండి నన్ను - జాలి బెట్టెనమ్మా॥

## 45. ఆనందభైరవి - చాపు

పల్లవి - ఏమిసేతు విరహవేదన
యెంతని తాళుకొందునమ్మా.
అను...సామినాపై ప్రేమమరచె
నామదికెంతో దిగులుదోచె॥ ॥ఏమి॥

కోరినకోరికె కొదవలాయె
సూరిమెల్ల వెగటాయె
వారచూపులే జూడడమాయె
వంచన దైవము పగదాయె॥ ॥ఏమి॥

తలచి తలచి వగచుటాయె
నిలచినచోట నిలువదాయె
చెలియరో యన్నము సైచదాయె
చిత్తము వాని విడువదాయె॥ ॥ఏమి॥

మనసురానీ మాటలాయె
వినయమెన్నడో విడచిపోయె
యొనసిలేదని ఏరాటు సేయ
యొంచిన వేణుగోపాలునిమాయ॥ ॥ఏమి॥

## 46. సావేరి - త్రిపుట

పల్లవి - చిన్నదాననే చెనకే వించరిలో నీ
సిగ్గేల బయలయ్యారా.
అను...కన్నుసైగజేసి గారడములాడేవు
వెన్నముచ్చిలిదిన్న వేణుగోపాలనే॥ ॥చిన్న॥

బొమ్మలపెండ్లికి కొమ్మలువేగ వే
ఇమ్మన నేసంతోషమ్మున బోవగ
సొమ్ములివిగో గైకొమ్మని చెంతను
రమ్మని సుంతముద్దిమ్మని కొసరేవు॥ ॥చిన్న॥

పున్నమనుచు సన్నవన్నెగలుగ జట్టి
కన్నెలతో నిసుగవిన్నెలచే నైన
గున్నపొన్నలచాయగా గన్నెరులు గోయు
మన్న తిన్నగపొంచి చన్నులు పట్టేవు। ॥చిన్న॥

పండ్లుగావలె చెల్లెండ్లకనుచు గొల్ల
యిండ్లిండ్ల తిరిగి పూచెండ్లుకొమ్మని మగ
వాండ్లునవ్వగా పన్నెండేండ్లదానవు నిన్నె
పెండ్లాడేనని గూడ నిండ్లకుబిలిచేవు॥ ॥చిన్న॥

## 47. కర్నాటసారంగ - త్రిపుట

పల్లవి - చెప్పనంమాట చెల్లించుకొన్నాను
చెల్లునా నీవలుగను.

అను... విప్ప పనేమిక వేసునోపాలును
అప్పుడే యనలేవ యతినా నీమునుగ ॥చెప్ప॥

మనసువచ్చిన చెలుల మాయింటికి రప్పించి
మచ్చికసేసి నవలేదా యెంతో చెప్పి
చనువిచ్చి నీకంటె చాలా గమన్నించి
సరసాలాడుదు ననలేనా యింతా
కలివిడి నుండైన కనుగొనోచక యుంటె
కలిక రమ్మని లేపా ప్రొద్దుపోవా॥ ॥చెప్ప॥

అనుపైన సొమ్ములు అలవాని మెడనుంచి
అందము జూతు ననలేదా దివ్య
పరిమళగంధము పాలిండ్లపై నలది
భోగాలిస్తు ననలేదా మదిని
జాగములేక నేనల్లిబిల్లిగా నుంటె
జాలివేసి రమ్మనలేదా యిదే వాదా॥ ॥చెప్పి॥

నిన్ను గూడినయట్ల నీవు నిలుచుంటగ
కన్నె నేలుదు ననలేదా యిక
కొన్నాళ్ళకీ ముద్ది కొమ్మ మరచేవా
కొంగుముడి వేయలేదా యిది
అన్ని సమ్మతించి అనుకూలమైయుంటె
అజ్ఞాపించి రమ్మనలేదా తెలుసుకోరా॥ ॥చెప్పి॥

## 18. యదుకులకాంభోజి - త్రిపుట

పల్లవి - ఇంత నిర్దయుడవుట ఇది నానోముఫలము
ఇంతి నిన్ననవేలే.

అను...చింతింప పనిలేదు చెలియ వేణుగోపాలు
డంతరంగము దెలిసి మనవిని
రంతము దెలుపర నాపై॥ ॥ఇంత॥

చెవినిల్లుగట్టుక చెప్పిన మాటలు
చిత్తమని వినలేదో
విద్యలకు మెచ్చిన దొర తాగాదో
హ్రుదయమున లేదో

యువిద నన్నలయించ యుక్తమైతోచితే
యెవరి నొచ్చుకొందు యెటుల తాళుకొందు॥ ॥ఇంత॥

నమ్మియున్నదెల్ల నలుగురి ముందర
నగుబాటు కెడమాయెగా
సరివారి మన్నలలు మిక్కిలి సేయగా
చులకతనమేగా
యెమ్మెకానికాబోటి హితవా టే పదివేలు
కొమ్మ నేటికిదెలసెనమ్మ వాని నిజాలు॥ ॥ఇంత॥

మనసిచ్చి కూడిన మంచితనమెల్ల
మరపువచ్చెనేమోగా దానివలెనే
మదిరా నమ్మనేమోగా బాగాయెగా
వనబోణికా ర్వేటి నగర వాసుడైన
ఘనుడవు వేణుగోపాలుడు గాంభీర్య పురుషుడైనే॥ ॥ఇంత॥

## 49. అపహాస - చాపు

పల్లవి – వలచితినే నీపై ముద్దుబాలా
తలచితే నామది

అను. . . తాళదు విరహ మగ్గలమాయె॥ ॥వలచి॥

వంచన మానవే మంచి మాటాడవే
వంచున బాడవె పంచశరుని చిలుకా
యించుబోడులు మేటివందు సభాస్థలి వినినే॥ ॥వలచి॥

నమ్మినవాడనే కొమ్మల వేడనే
తెమ్మెర దాయనే నెమ్మది నోర్వగలనా
సమ్మతి చిగురాకు కెమ్మోవి తేనెలానగనే॥ ॥వలచి॥

దక్కితి వలలా చిక్కితినే గోలా
మ్రొక్కెద యీవేళ గ్రక్కున నేలుకోవె
చక్కెర బొమ్మరో నిక్కము వేణుగోపాలుడ॥ ॥వలచి॥

## 50. ఆనందభైరవి - త్రిపుట

పల్లవి - కుందరదన నాపై కూరిమి మరచితో
కొసరివేడిన పలుకవేమె ఆ కౌనే

అను...సుందరీమణి వడి సుళ్లు బెట్టుచు యిట్లా
యెందుకు యేచేవు యికనైన దయజూడవె॥ ॥కుంద॥

కలనైనా మరువజాలనే నిన్ను
గడియజూడకున్న జాలెనే యిట్లా
అలయించిన నాదాయ మెంతౌనే
వలచి వేలునాకి వ్రతము జెరుచుకొంటినే॥ ॥కుంద॥

అడుగులకు మడుగు లొత్తేనే కెమ్మో
వానవీయవె జంటితేనె యింత
పడుచుతనమా బుద్ధి బంగారాయనే
తొడరిదై వానికే ద్రోహము జేసితినె
వేణుగోపాలుడగానా నన్ని
వేళరతుల సుఖానా కీర

పాణి ప్రేమదాచితే వస్తికిమారున
జాణవైనానే నీసరియువరే చెలులలోన॥ ॥కుం॥

## 51. ఆనందభైరవి - రూపకం

పల్లవి – ఇట్టి ప్రియము సంభ్రమ తెలుపు యీ సరసాలు
అను...పట్టుపడా నాకొంగు గట్టిగ వేణుగోపాల॥ ॥ఇట్టి॥

ఇందుంటే వకవారాలు యిలు వెడలితే వకమాట
దంపనకాడా రా నీపయుతెల్ల తెలిసె
ముందుకు నేటికో నేప్రు మొన్నాయనేస్నిరి చిన్నెలు
సుందరివలె నీకైన అందకత్తెను గాను॥ ॥ఇట్టి॥

ఎక్కడ సీమది కితవో మొవతెకు నీపై నెనరే
అక్కడికే పోవలెగా ఇక్కడ పనియేమిరా
కక్కసముగ వకటంటె కానిదే యనిపించుటకా
చక్కగ నీకెందైనా చల్లగ యుండుటె చాలు! ॥ఇట్టి॥

తగవా శ్రీకార్వేటి నగర వేణుగోపాల
ఆగడైతి నినుగూడి సందున సుఖమేమి
మొగమాటము జూపని చెలెల్ల నావద్దనా
నగమా సెను ప్రొద్దైతే తగ పొందుండను నీతో॥ ॥ఇట్టి॥

## 52. ముఖారి - త్రిపుట

పల్లవి – ఏ మ్యోద తొలగించినదె నేనము జేసి
పలుకకుందు రటవే.

అను... నెయ్యెవిధమ్ముల వేణుగోపాలుడు
నెయ్యము జేసిన నెనరైన దలచక॥ ॥పయ్యెద॥

కలనైన పరసతుల కన్నుల జూడని
చెలువుడా నీపాద నేసేవ జేసేనంటే
వలదు పొమ్మనుచు ఆవలి మోమైతివి
చెలియగో నీకింత చెల్లుబడి యేమే॥ ॥పయ్యెద॥

తియ్యని కెమ్మోవి తేనె లీయవే యని
చెయ్యెత్తి మ్రొక్కిన చేరదీయవైతివి
అయ్యయ్యో సుంత వాడనురుసు రనుకొంటె
తొయ్యలి నీకిది దోసముకాదటే॥ ॥పయ్యెద॥

వనబోణి నినుచిన్ననాడే చెలిమిజేసి
మొనసినాడని మది నెందుకే పదరేవు
అనుకో పనేమిక నతివరో ఊరకే
వెనక చింతించేది వెఱ్ఱితనము కాదా॥ ॥పయ్యెద॥

## 53. ముఖారి - చాపు

పల్లవి - ఎందుకు బొంకేవురా లేదని నాతో
మొమ్మోలు సేయకురా.
అను...ముందరివాడవ వేణుగోపాల నీ
ముచ్చవగల మానగా నాసామి॥ ॥ఎందుకు॥

నిన్న దానింటికి పోలేదో
నీవది నన్నాడు కోలేదో

అన్నియిప్పుడే తార్కాణగాదో
మూర యిట్లయితె కోపమురాదో॥ ॥ఎందుకు॥

సరసా లాడుకో లేదో
సన్నజాజులు జెడ నుంచలేదో
పరిమళ మలదలేదో
ధామచే సిగ్గు మందుకో లేదో॥ ॥ఎందు॥

చెలిని కౌగలించలేదో
చేరి మోవిని ముద్దిడలేదో
కలకల నవ్వుకో లేదో
కీరవాణిని మెచ్చుకో లేదో॥ ॥ఎందుకు॥

దయ మరున వద్దనలేదో
దక్కితినని వేడుకో లేదో
నయమ్ముగా పదమునలేదో
నాతి నిను బాయలే దనలేదో॥ ॥ఎందుకు॥

కన్నుగూడినవాడవు గాదో
నాతో నీసుద్ది దెలుపనిదో
చిన్నబుచ్చితే దోసము లేదో
కన్నె నేలితినని పలుకరాదో॥ ॥ఎందుకు॥

## 54. ముఖారి - ఆది

పల్లవి - అక్కర లేని కాపురమామె
అతని మనసు వేరామె.

అను...మెక్కడిదీ దానిపాలాయె
యెవరాడిన రోసము లేదాయె॥ ॥అక్కర॥

మగువ నాపేరు దలచడాయె
మమతలు మరుపాయె
పగలు రేయి అందె వునికాయె
పాళిమెక్కువాయె
సొగసు లీవెనుక మెండాయె
వగలు సేయనాయె
యిగురు బోణికిది నవ్వులాయె
యేమమ్మా వలపుమందు మాయ॥ ॥అక్కర॥

ఇంటిదోవ తొంగి చూడడాయె
సొంట్లు వెదకుటాయె
వొంటిగా చెప్పి చాలాయె
నోర్పు లేదాయె
తుంట పడుచు సాహసమాయె
మంటిముక్కాయె
అంటెననచు యీసు నిండాయె
ఔర అరపరాని ముత్యమాయె॥ ॥అక్కర॥

దానిపొందు సంతోసమాయె
దైవము తోడాయె
చానరో నాపొందు కల్లలాయె
సడ్డ లేదాయె
తాను వేణుగోపాలుడాయె
దయలు దూరమాయె

కానివారి కిది వేడుకలాయెను
గద్యాలే వానికి సతమాయెను॥ ॥అక్క-ర॥

## ౫౫ ముఖారి - ఆది

పల్లవి - తన చిత్తము వచ్చినట్లా
దయ సేయ మనవే యేమే.

అను... వినవే శ్రీకార్వేటి నగర
వేణుగోపాల దేవునితో॥ ॥తన॥

చెలిని వేడుకొన్నాడట చేతులెత్తి మ్రొక్కినాడట
అలివేణితో నన్నేమెనా అనుకున్నాడట
నళినాక్షికి గుట్టుమీరగ నమ్మిక లిచ్చినాడట
జలజగంధి విరహమెంతైన నల్లనై యుండేటేలు॥ ॥తన॥

తొలిసారి యీదిక్కు జూచితె దోసము వచ్చుననెనట
పడతివద్ద మీసముద్దిద్ది పడుకొనెనట
తడయక నాపేరు దలచి పుడక ద్రుంచినాడట
అనుగులో వేయిగుణములైతే అతని దిష్ట నెవరెరుగనెను॥ ॥తన॥

మోహనాంగుడు నను తొలుత మోసపోయిగూడెనట
ఆహారినాక్షిగ యిక న్నినంటుకొనెనట
సాహసురాలని యెంచు సభలో వాగొన్నాడట
స్నేహము నాటియుండితె చెలువునికే దయవచ్చునే॥ ॥తన॥

## 56. అసావేరి - ఆది

పల్లవి - వంచనలకు గురుపీఠమురా యీ
చంచలాక్షి యనగా

అను...మంచిదిక కదా యంటివి యిక పలు
మాటలేల వేణుగోపాల॥ ॥వంచన॥

కండ్లు తేలించి కులికి నవ్విన
కౌగిలించినా పువ్వుల
చెండ్లు దెప్పించి శిఖను జుట్టిన
చెక్కిలి నొక్కినా
గుండ్లపేరు నీకు కానుకిచ్చిన
గుసగుస లాడినా
ముండ్లమీాది వలువ సామ్యమేగా
ముదిత వలపు తిన్నగ డెలిసీనీ॥ ॥వంచన॥

అడుగులకును మడుగులు తా పరచిన
హారతులిచ్చినా - కర్పూర
వీడెము సేయుమని లాలన వీనెమిాటినా
గడియకొక్క వింత సొగసు జేసిన
గంధము బూసినా
వృషమము కలుగులోని చెయ్యిసామి తె
యువిదె నెనరు తిన్నగ దెలసీనీ॥ ॥వంచన॥

మూతిసాచి ముద్దిమ్మని కొసరిన
ముచ్చట జెప్పినా తన
చేతవిరుల సురటిబూని విసరిన
చేలాగిచ్చినా
రాతిరి నీమనసు రంజిలగ రతులగూడినా
కోతిచేతి మాణిక్యము సామి తె
కొమ్మమనసు తిన్నగ దెలిసేనీ॥ ॥వంచన॥

## 57. సావేరి — ఆది

పల్లవి – పూసలోని దారమువలె నెంత
జేసె నమ్మినందుకు అయినా బళ్
అను...మోసమే అడిగితే తగని
రోసమే వేణుగోపాలుడు॥ ॥పూస॥

ఎవతె యింటికిని పోనని నాతో
నెందరింట్లు తిరిగివచ్చె గడియలో
శివశివా అతని మోము జూచితే
సేతుయాత్ర పోయి వచ్చిన దీరదు॥ ॥పూస॥

అటకమీద చలువ చీర సైగగ
ఆపెకిచ్చి సేవించు కొనెనట
కటకటా వీని పేరు దలచితే
కాశియాత్ర పోయివచ్చిన తీరదు॥ ॥పూస॥

నాయకసానుల సంగతి నిమిషము
బాయలేడు నన్ను వలచి పొలక

మామచేసె గూడినందుకిక చాం
ద్రాయణము చెరియించిన దీరదు॥ ॥పూస॥

## 58. కాపి - ఆది

పల్లవి - వక్కకైన నాసలేదు గదవే
వాని చెలిమికొక దండమే మంచి

అను...చక్కని వాడైతే నిండునటే
సఖియ వేణుగోపాలుని చేతి॥ ॥వక్క॥

చెడ్డ చేని కింటివడ్ల పొంగలి
జేసినట్లు మెదురుపు దరిశించితె
దొడ్డరసికు డనుచు పేరు మాత్రమె
గుడ్డి గవ్వ జూచితె నీయాన॥ ॥వక్క॥

ఉడుముబోతె పోయినది చైమాత్రము
విడిచితే చాలు ననే కథగా
పడతి తాను కుదువబెట్టిన సొమ్ములు
పైకమిచ్చి విడిపించితె చాలద॥ ॥వక్క॥

మొగమాటమున మాట తోయజాలక
మునుపు మెవతో కడుపాయె నందురు
వగయింత లేక వాని గూడితి
ప్రసురు వుంటే వుప్పమ్ముకొగల॥ ॥వక్క॥

## 59. ధన్యాసి - చాపు

పల్లవి - ఇచ్చిన మంచిదె యివకున్నా మంచిదె
యింటికి రమ్మానవే.

అను...వచ్చితే యేమన వలదే మెచ్చుకొనీని
మెచ్చగాని చుట్టమే వేణుగోపాలు॥ ॥ఇచ్చి॥

కలనాడు వకగవ్వగా సెలవుసేయడా
కలిమి లేము లనగ కావటికుండలు
కలకాలమొక రీతి గావచ్చునా వుండి॥ ॥ఇచ్చి॥

మేలుదలచక యీవేళ పోపొమ్మంటె
నాలుగంటి దైవము మెచ్చునా
ఆలోచ నెందుకే అతను మనకు వేర
కాలముబోవును కడను మాటనిలుచు॥ ॥ఇచ్చి॥

నేడువచ్చిన నెనర నెలతె నన్నురతుల
గూడిన ముచ్చట గుఱుతెరుగవా
ఆడికులకు లోనైనాదున బాగాయ
ఓడల బండ్లౌచ్చు బండ్లు నోడలబోవు॥ ॥ఇచ్చి॥

## 60. శంకరాభరణం - ఆది

పల్లవి - తేనెలూర మాటలాడకు తెలిసె నీసెవరు.

అను...మానినీ మనోహర శ్రీసాళువ
మాకరాజ కార్వేటి రాజేంద్రా॥ ॥తేనె॥

పండుగనుచు వెచ్చాని కడిగితే
పల్లిపట్టు రెండా నాపై
కొండెకారి మెడకు మంచిబంగరు
గొప్పగుండ్లదండా
నిండు కొలువులో బిరులించితివా
నెలత కొప్పునిండా యిక
వుండవలద యిటువంటి నేస్తము
యువిదె నెనయుచుండ వదలకుండ॥ ॥తేనె॥

ఎక్కువైన ముత్యాల పాపట
యింతి కీయలేదా మున్నే
లెక్కలాడి నాచేతి కిచ్చినది
యెుక్క చీర గాదా
నక్క వినయములు జేసేవారికి
చక్కని మరియాదా నే
నిక్కమేమంచి నోమునోచితె
నీకే దయరాదా యికమీద॥ ॥తేనె॥

మరుని కేళి మెప్పించినందుకు
మగువకింత ధనమా నా
సరస జేరి యేలుకొమ్మంటే
సామీ దంధనమా
అరుదు జేసి యా చెలినే పొగడే
వారా నెరతనమా తన
పెరటిచెట్టు మందుకు గైకోరని
పెద్దలనగ వినమా యిది ఘనమా॥ ॥తేనె॥

## 61. ఆనందభైరవి - ఆది

పల్లవి – దాని కెవ్వరుసాటీ ఆవెలది నీకే
తగురా రాజకిరీటీ.

అను...మానిత వరగుణపేటీ నీపై
మరలుకొన్నదిరా మాబోటీ యికనిను
మానదురా భానుసమతేజా
మాకరాట్కార్వేటి రాజా॥ ॥దాని॥

మగువను సభల నెన్నుదురు
మామనదలించు నెన్నుదురు ఆ
వగలాడి పల్వారుస కుదురు మేటి
వజ్రమణులనుచు బల్కుదురు యీ
జగతి దాని కెవ్వరు సదురు విరి
జాజులంపె నీకు నదురు మంచి
నిగనిగలు గల మొగడు తమ్ముల
దెగడు చనుగవ బాగడ తగునిక॥ ॥దాని॥

వనజగంధి కనుల దీరు చూడ
వలరాజు చేతి కిలి తీరు ఆ
ఘనవేణి మెరుగు నూగారు సౌరు
గణుతింప ఫణులిడు గారు
నిను రమ్మనె పలుమారు తూపు
మొనల కోర్వాదు పలుమారు అను
దినమునను చెలి మనము సమ పెన
గొని తమి యింతనగ వశమా॥ ॥దాని॥

సుదతి నెన్నగ శ్రీలమిన్నా దాని
శృతులపై కరి శ్రీలమిన్నా ఆ
మదవతి కేగాను సున్నానాదు
మనవి వినవా మనసున్నా
బెదరించు కురు లళుల కన్నా గొప్ప
పిరుదులు చక్రముల కన్నా సామి
అదనిదని మరుకదనమున సతి
నెదనుతమి వదలకను గదియర॥　　　॥దాని॥

## 62. శంకరాభరణము - త్రిపుట

పల్లవి - వలదు యీమాట లేలరా మది హితవైన
వనిత యిల్లిది గాదురా

అను... వెలయ శ్రీ మాకరాజ వీర కార్వేట్రాజేంద్ర
చెలులు దెలుపగ దెలిసె నీవగలు చాలు పదివేలు॥ ॥వలదు॥

కరుణచేతను కోరి మోహించియా
కనకాంగి నినుజేరి మఱిమఱి తమి మీఱి
విరహాభరముచే తరము గాక తారీ మరులూరీ
తరుణి గురుకుచ గిరుల నురమున
నొరసిమురిసిన సరస మెల్లను
మరచి వత్తురె యేర యాదారి ఓరోరి॥　　　॥వలదు॥

సగమురే వేళాయరా నీ రాకకై
సఖియు యెదురు జూచురా
తగని ముచ్చట లేలరా నేనొకటంటే

వెగటు దోచ దటరా బాగేనటరా
మగువ లెల్లను నగగ నీవిటు
అగడు సేయగ నగున జిగిబిగి
సొగసు మిగులగ పెనగ గల నటరా
నన్నంటకురా॥ ॥వలదు॥

సతతము నను చాల

మెచ్చియుండిన జాణతనము లేల
బతిమాలు కొనేదేలా వినయములకునే
నతి బేలనా యిట్లేల చతురోక్తు నేల
తతిని దెలుసుక అతివ వలె బహు
గతుల నిన్ను పరతేల నెనయుచు
సగులు మేలన ఘనుడ నేజాల నీచర్య లేల॥ ॥వలదు॥

వనజాక్షి బోటు లెవరైనా యిచ్చటయున్నా
వనిదాని సముఖానా మనవి జేసిరైన
నెరనమ్మిన చనవ సుంతైనా కొనియాడునా
అనువుగను ననుదినము యాజ
వ్వనిని గలసిన పనులు హొయలుగ
తనిసి యున్నది నీకుమనమునా॥ ॥వలదు॥

పలుమారు ఎంతకొసరిన మునుపటివలెనే
బాళితో మనసిచ్చేనా చెలువుడనుచు జూచేనా
ఇకమీదనా యిలుజేర రానిచ్చేనా, చనువిచ్చేనా.
తొలుత చెలిమిని కళలు గులుకగ
కలిసి మెలసిన సెలవు దలతున
తలపు తెలియని వలపు తగవేనా యేమైనా॥ ॥వలదు॥

## 63. బిలహరి - త్రిపుట

పల్లవి - ఏల నే యీచలమేలనే పలుమారు
మేలుదాననవే వినవే

అను... బాలరో వేణుగోపాలుడు నన్నింత
జాలిజెందించి యీలోలాక్షి యిలుజేరె॥ ॥ఏల నే॥

కుటిల కుంతలి విను నిన్నటిరేయి విరితోటా
కటుల రమ్మనె నట విటరాయడిటుల ఆ
విటుకులాడిని బిగి కౌగిటజేర్చి మేలౌ చా
కటు లిచ్చినాడట యెటుల సైతునె నిచటా॥ ॥ఏల నే॥

కొమ్మరమ్మని నినే నమ్మినానని విభుడా
యెమ్మెలాడి జడను కమ్మని మరువంపు
రెమ్మలు సవరించి సొమ్ములు ధరియించి
నెమ్మది గూడినాడమ్మ మనమ్మున॥ ॥ఏల నే॥

ఎంత సంతోసముగా కాంతలలో మేలైనా
సొంతకారివే యని శ్రీకాంతుడు ననుగూడి
నంతలో దాని యేకాంతము మదిదలచి
పంతగించి నటుల చెంతకు రాడాయె॥ ॥నేల నే॥

## 64. పంతువరాళి - త్రిపుట

పల్లవి - వట్టి చూపులతోనే వలపు బుట్టించ నీ
వలె నెవరీ జగతీ వేరే ఇదినీ

అను... పుట్టుక దినుసేమొ పొలతి కలయ చైచె
తట్టిన గువగానె తనువు ఝల్లుమనగ॥ ॥వట్టి॥

సందె వేళనీవు మాసందు వీధిన వెడలి
సుందరవదనలతో గుసగుసలా
ముందు వచుచ్చు లేని ముచ్చవగల తొలనై
మందిలో గ్రక్కున మాటి మాటికి తిరిగి॥ ॥వట్టి॥

నిన్న జగనోన్నహాసివలె తళుకుగ
అన్ని సొగసుల నీవందముగ
చిన్నగ తిలకము దిద్ది యద్దమెదుట
వన్నెలాడిరో తలుపు వారజేసుక తొంగి॥ ॥వట్టి॥

పల్లవాధరి నన్ను గోపాల రమని బిలచి
అల్లిబిల్లిగా నుండి యాదరించి
కల్లలాడిరో మరుని కార్పణ్యములు బాయ
కొల్లగ రతి నేలి కోరికె దీర్చక॥ ॥వట్టి॥

## 65. పంతువరాళి – అట

పల్లవి – వింటిరేమే చెలులారా వాని చెరియలు
గంటిరేమే సఖులారా.

అను...గొంటుకాడై తిరిగే వేణుగోపాలు డలివేణికుతురి
గంటేలు దొంగిలిచి చిత్రగంటి చేమ చేరెనట॥ ॥వింటిరే॥

ఇందుబోణింట్లో పుయ్యాల మంచముమీద గూర్చుండి
పంచదార నెయ్యి పాలారగించి మందపయికర
కంచుచీర చంకలో యిరికించుకొని గడియదీసి
కంచికావల తెల్లవార కదిలెనట కాలికొద్ది॥ ॥వింటిరే॥

సరసుడ నీవద్దజేరి మురియుచు బాగాలందిచ్చి
పరిమళగంధి పక్కలో పవ్వళించి తా
సరిప్రొద్దున లేచి దాని సరిపెణ కత్రించుకొనీ
తిరవళ్లూరు దాటిపోయి తిరిగిచూచి నవ్వెనట॥ ॥వింటి రే॥

ఈవికాని వలెనె చెలిని హితవుగా డగ్గర దీసి
తావు తావు లంటి రతుల తనియించేవేళ కత్తెర
బావిలి విడుచుకొని సరిగ పయిట కొంగున తేలుగట్టి
భావించినపుడె సప్పుడూరు బంకాపురము కదిలెనట॥ ॥వింటి రే॥

## 66 శంకరాభరణము - ఆది

పల్లవి - అలుక జేసి పలుకడేమొ యాచెలి
వలపుమందు బలిమో
అను... పెలది వినవె శ్రీకార్వేటినగర
నిలయుడైన వేణుగోపాలుడు॥ ॥అలుక॥

కలికి చిలుక పలుకులకును సొలయుచు
చెలిని గోరినాడే నను
బలిమి జేసి వలచియున్న బాళిని
కలసి మెంచినాడే
తలిరుబోణులలో బలువిధముల నీటు
చులక జేసినాడే యిక
చెలిమి దలచి కలసి మెలసి అలయక
వలవు నిలుప గలన లలన చెలుడు॥ ॥అలుక॥

తెగువతోడ నా మగువకు వెలగల
నగలు యిచ్చినాడే నే

సగము రేయి వేళ నగరు బంపితె
అగడు జేసినాడే
వగలుజూడ నే సొగసుగ బిలిచితె
నగవులాడినాడే యీ
వగలు వలదు సుగుణముగల వగధరు
దగిలి పొగడి తగదను బహుఘనముగ॥

సరసముగను యీ సరసిజ ముఖిపై
మరులు జెందినాడే నే
సరసజేరి కరుణ జూడమనినను
విరస మాడినాడే
తరుణి వినవె మును సురతము నేలిన
సరణి మరచినాడే యీ
మరుడు శరము చురచురమని గుచ్చగ
నురము నొరయ బరపె తరమ మరిమరి॥ ॥అలుక॥

## 67. ఆరభి – ఆది

పల్లవి – నేను నీవు కనుగొన్న వేళ మొగ
నేస్తము బాయదుగా మరిమరి
నెమ్మది గలిగెనుగా.

అను... మేను నీ సొమ్మని యానలిడుకొని
మెచ్చితి యీడన వేణుగోపాలుడని॥ ॥నేను॥

చిన్ననాడు పండు వెన్నెలలో యిసుక
దిన్నెలపై సురపొన్నల పాన్పున

పన్నీరు జల్లుక పవళించె లాహిరై
యెన్నెన్నో విధముల యెదనెద నదుముక॥ ॥నేను॥

ఊరినుంచి కలలోవచ్చి పైకొన్నట్లు
పులికి దిగ్గున లేచి నే నెదిరించినట్లు
తీరుగాదని డింకి తిరిగి సొలసినట్లు
చేరి లెమ్మన్నట్లు చై చై పట్టినట్లు॥ ॥నేను॥

మగడు వినిన చుట్టము లెడబాసిన
తగదని భూపతి దండన జేసిన
అగడైనా మెంత పాపము వచ్చిన
జిగిజిగి సొగసుగ వగలు పెనగొన॥ ॥నేను॥

## 68. ముఖారి - ఆది

పల్లవి - చాలుచాలు వాని నేస్తము యిక
నేలనె మనకూడ

అను...బాలరో వరద నారాయణు
డా లతాంగి గూడి మెలగి యుండుటె॥ ॥చాలు॥

ఆసజెప్పి గుడిముందర యిచ్చిన
బాస మరచెకొమ్మా యీ
దోసకారి యెందరినో యీవగ
మోసబుచ్చెనమ్మా
నా సరైన చెలులువిన్న వికవిక
నవ్వరేమమ్మ విన

దోసమో కలిగిన మాటంటె
రోస మెందుకమ్మ పోవమ్మ॥ ॥చాలు॥

తనువు తనది జేసియున్న నావం
తైన దలచడమ్మా యేదొక
మనవి దాని కెరిగింపక వినడట
మంచి పనేనమ్మా
నెనరువాని జాడ లాడకాడకు
నేడుగంటికొమ్మా అతి
వినయమెల్ల ధూర్త లక్షణమనే
విధమాయెగదమ్మ లేవమ్మ॥ ॥చాలు॥

వరద నారాయణ సామెంత
వంచన వాడమ్మా నా
సరసజేరి ననుగూడి లేదనుచు
సాధించె గదమ్మ
యిరవు పల్లిపట్టై తేనే తన
యెక్కు వెవరికమ్మా యే
మెరుగనట్టివాని వలెనె వుండి
యెంతజేసెనమ్మా వలదమ్మ॥ ॥చాలు॥

## 69. ఆనందభైరవి - ఆది

పల్లవి – రమ్మనే యీమేను వాని సొమ్మనే
కౌగిట జేర్చుకొమ్మనే మోవితేనె లిమ్మనే

అను... బాలనే తమక మణప జాలనే పతిజూడని గాగ
సేలనే యీ జవ్వన మేలనే॥ ॥రమ్మనే॥

మించెనే మరుడు నన్నాదరించెనే శుకశారికెలు రవ
ళించెనే నెలరాజు గర్వించెనే॥ ॥రమ్మనే॥

వాదటే యీమేను నీదేగాదటే వానినిందు తే
రాదటే నెనరింతైన లేదటే॥ ॥రమ్మనే॥

మెచ్చెనే దాని నడిమీకి దెచ్చెనే మేలైన బిరుదు
లిచ్చెనే యెంతపని వచ్చెనే॥ ॥రమ్మనే॥

నాయమూ వెతలు బెట్టుటా న్యాయమా వొంటిగానుండే
పాయమా నాచెలిమింత హేయమా॥ ॥రమ్మనే॥

చూచునా తొలుతటి ప్రేమ దాచునా మనసున దయ
తోచునా నేరము లన్ని కాచునా॥ ॥రమ్మనే॥

బట్టుబెట్టి నన్నేలీనా వరదా నారాయణుడా పల్లి
పట్టునా తిరుగా చెట్ట బట్టునా॥ ॥రమ్మనే॥

## 70. ఫరజు - ఆది

పల్లవి - రాజీవాక్షిరో సామిని రాజిగ రమ్మనవే
అను...రాజసమున మా యింటికి రా చెల్లదు కనవే॥ ॥రాజీ॥

చెలులేమే మొగబోసిరో చెలువునితో నేడు
పలుమరు యెంతో వేడిన పలుకక యున్నాడు॥ ॥రాజీ॥

తా యిచ్చిన నమ్మికలంతా యిపుడే మాయా
హా యేమని దెలుపుదునె హాయే లేదాయా॥ ॥రాజీ॥

వూరకె మది నొప్పించితె వూరట యేమమ్మా
వేరుగ నను జూచితె నవ్వేరు గదే కొమ్మా॥ ॥రాజీ॥

వరదా నారాయణుడీ వరదాక నన్నేలి
సరిదానికి యసమిచ్చి కొసరి తా బతిమాలీ॥ ॥రాజీ॥

## 71. ముఖారి - త్రిపుట

పల్లవి – అరుదు గాదటవేమె యమ్మనే జెల్ల నే
డతడిందు వచ్చినది

అను...సరసిజముఖి అన్నుణ సరసీతటి నెలకొన్న
పరమాత్ముడైనట్టి ప్రసన్న వెంకటశౌరి॥ ॥అరుదు॥

దక్కితినని చెలులెందరో చుట్టు తిరుగగ
వక్కతేప కడపైన తొక్కినాడటే యింక
యెక్కడి మోహామే యెపుడు నిన్నెరుగడు
చుక్కవంటి ముత్యము ముక్కర తీసుకొని॥ ॥అరుదు॥

నిగ్గు లెంతసేపే సిలువుటద్దము మానీ
సిగ్గు పడకపోవె దగ్గరి పిలచీనీ
యెగ్గు బెట్టేవుసుమీ యేపని జెప్పిన
మొగ్గల పని చీర మొన్ననే తీసుకొని॥ ॥అరుదు॥

ప్రేమమీర నిన్ను పెనగి కూడేవేళ
రామామణిరో యుపరతి గానీ ముందర
సామిగాదా యని వంచాడించ బోయ్యేవు
నేమము రేపైని సేవళము దీసుకొని॥ ॥అరుదు॥

